పోతావుంటే పక్కపక్క అరుగులమీాన, రాత్తాపక్క సెల్లి మొగళ్ళకాడ, కాత్తే సుమారైన వూరిజనం నడుంకట్లేసుకూకుని, పువాకు యీానెల దీసుకుంటా నోళ్ళు దెరసుకు నీలు గారుత్తా సూత్తావుంటారన్నమాట.

ఈ యవదానంలో—కోడి పెట్టినగుడ్డు పిల్లయి కూకుండట్టు—నిన్న మొన్నదాకా ఎలికతోకల జడలేసుకుని ఏ అరుగుల మొత్తల్నబడ్తే ఆ యరుగు మొత్తలకాడ తచ్చాడ్తావుండే పిల్లముండలు యిట్ట తెలవకుండానే వుండట్టుండి, రంగు కోక లెగ్గట్టి నునుపెక్కన కట్మిస్తిలో ఆ వజాన కూాల్జనంలో పడి పోతావుంటే, కూాకుని పరిచ్చగా సూత్తావుండ అనువంటి సుమారయిన వూరిజనానికి నరాలపొట్టుదప్పి నీలుగార్తయ్యాన్న మాట.

అయితే యీామద్దెనే కాత్తె పెద్దమడ్సయిన రత్తికి ఎలిక జడబోయి బతికిమళ్లే కొప్పొచ్చి, పోయిన మార్నాలపండక్కి జేజి కొనిబెట్టిన ఎర్రకోక ఎగ్గట్టి, తెల్లగన్నేరుపూలు కొప్పులో తోపుకుంటా, అందన్లోబడి నాట్లకి ఎల్తావుంటే సూత్తాకూకుండ నలుగుజ్జనానికి తను ఎట్టగుపిత్తావుండది ఎట్ట తెల్సుద్ది?

శివమ్మగారి శివయ్య, బసమ్మగారి సుబ్బయ్య రాత్తా పక్క సింస్టుకింద పువాకు యీానె ల్దీసుకుంటా ఎల్తావుండే కూలి జనాన్ని - పూరకనే సూత్తా కూకుండారు.

'సుబ్బయ్యా?'

'ఏందిర శివయ్యా?'

'ఆ పొయ్యే మడ్సి మన రంగయ్య కూతురు రత్తేట్రా?' అన్నాడు శివయ్య మీాసకట్టు తుడుసుకుంటా.

'అదే సూస్తున్నా ?' అన్నాడు సుబ్బయ్య రత్తిపోకడ కనిబెట్టా.

'ఎదిగిందే!' అన్నాడు శివయ్య.

'పొండుకుమల్లే పండింది !' అన్నాడు సుబ్బయ్య.

'తల్లుమ్రండ మొయ, బల్‌గురిగా వాదిలావే మాట ?' అన్నాడు శివయ్య సుబ్బయ్యను అట్టోక సూపు జూసి.

'ఉండ విషయం అది సెప్పొద్దూ!' అన్నాడు సుబ్బయ్య సిన్నగా నవుతా.

'సినిమాకిమల్లే వుండదే !' అన్నాడు శివయ్య.

'సినిమా ఏందిరోవ్ శివయ్యా ?' అడిగాడు సుబ్బయ్య.

'ఎహె మొన్నంటే మొన్నద్దాకా ఎలికతోకకుమల్లే ఇంత జడేసుకుని తిరుగుతుండేదంటే!' అన్నాడు శివయ్య.

'ఎవరు రత్తేనా ? యీ మద్దెనే పెద్దమడ్స యిందంటలే' సెప్పాడు సుబ్బయ్య.

'యిగనేం, యిచారిస్తా వుండావన్న మాటా ? మరి మనిషే కొత్తదన్నట్టు మాట్టాడ్తావేరా సుబ్బయ్యా ?' అన్నాడు శివయ్య.

'ఓరిపోరా ఎంతసెడ్డా నీకుండంత రంది నాకేదుంది!' అన్నాడు సుబ్బయ్య.

'మరి జాడా తియ్యంది నీకెట్టతెల్సురా అది పెద్దమడ్స యిందనీ ?' అడిగాడు శివయ్య.

'అంతేనా! మడ్సినిజూత్తే ఆ మాత్రం తెలవదెట్టా ? అయినా ? నీకు నాకుమల్లే నలుగురు అనుకుంటావుంటే

యియన్నీ యినిపిచ్చుకోకబోయినా తెలుస్తావుంటయ్యా ?' యిడదీసినట్టు సెప్పాడు సుబ్బయ్య.

'అంతేననుకో' వొప్పుకున్నాడు శివయ్య.

'ఆళ్ళ జేజి దెలుసా ?' అన్నాడు సుబ్బయ్య.

'ఎవరి జేజి ?' అన్నాడు శివయ్య.

'రత్తి జేజంటే ?'

'ఎవరు రోసెమ్మేనా ? అదిగేం రత్తి పక్కనేఎల్తా'.

'పక్కనే ఎల్తుండదంటూడూ. కరుసుకుని ఎల్తుంటే ?' అన్నాడు సుబ్బయ్య.

'కాపలా ఎట్టా ?'

'మరేంది ! అబ్బో యీ ముసలోళ్ళ సంగతి యింకా నీకు బాగా తెలవదుగావాల్ను - చరేలే ! అస లీ రోసెమ్మ మాటకి ముంగలే రోక తెత్తుద్దంట !' అన్నాడు సుబ్బయ్య,

'ఏంటి, రత్తిమీాద ఎవరన్నా కన్నేస్తారనేనా ?'

'అదే దానాట.'

'ఆఁ, ముసల్ది ! ఓరిపోరా యీ గూడెంజనం మనకి కొత్తంటా ! అస లెందుకు ఫద్దినాలు నువు వోపికపట్టి సూడు, యవారం ఎట్టదిరుగుద్దో సెక్రం దిరిగినట్టు !' అన్నాడు శివయ్య.

'ముసలాళ్ళకి కక్కుర్తి బోహు జాస్తంటలే' యింత సిన్న ఎండిబిల్ల సేతిలో బడ్తేసరి' అన్నాడు సుబ్బయ్య.

'మరిగనేం !' అన్నాడు శివయ్య.

'అన్నట్టు ఎంకట్రామయ్య నాల్దినాల్నుంచి యీ రోసెమ్మోళ్ళ గుడిసెలకాడే తిరుగుతావుండాడంట దేనికనబ్బా ?' అన్నాడు సుబ్బయ్య.

'ఎవరు అంకమ్మగారి ఎంకట్రామయ్యా ?'

'మరింకెవరు ఆఘగాకుంటె ?'

'ఆరి – ఆణ్ణోపాలి నలగబొడవాల్చిందే!' అన్నాడు శివయ్య.

'పెళ్ళోడికన్నా రత్తిమీనే! అందుట్టో ఈడు జేరాడా-' అన్నాడు సుబ్బయ్య.

'నువుమటుకు వూరకనే వుండేవోడివికాదే!' అన్నాడు శివయ్య.

'చా, నీతోడు! అసలు గూడెంసాయలకి ఎల్లే వారం పద్దినాలయితే! యింకా నువేమన్నా బోగట్టా జేశావేమోనని అడుగుదామనుకుంటుంటే ?' అన్నాడు సుబ్బయ్య.

'ఏంది–? తల్లుండమొయ నువురా మనగాడివంటే సుబ్బయ్యా! అసలందుగ్గాదూ నీకు కళవారుమణేలాఅని పేరొచ్చింది! పేడతక్కడని కతో టుండదిలే; అట్టుండది నీ యవారం జూస్తే.

'అబ్బే గూడెంక ల్లేమన్నా ఎల్తుండావేమోనని అడిగాలే' అన్నాడు సుబ్బయ్య.

'ఎహె, యిదియ్యాల కోకగట్టుకు అగుపిస్తే చూడాల్సొచ్చిందిగాని యింతకిముంగల దీనిమొగం ఎవరుజూశారూ?' అన్నాడు శివయ్య.

'అన్నట్టు రోసెమ్మోళ్ళు ఎంకట్రామయ్యా సేనుకే నాట్లుకుపోయింది, తెల్సా ?'

'ఆఁ! తస్సదియ్యా, ఆడ్రా వాంటిసేకిమీద యవారం నడుపుతాడూ! అప్పుడే జాడాదీశావే - నువ్వు వూరుకుంటా!' అన్నాడు శివయ్యా.

'ఆఁ, యిందాక ఎంకయ్యంటుంటే తెల్సిందిగాని లేకబోతే నాకిదేనెట్టా పనీ - యింకా నయం!' అన్నాడు సుబ్బయ్యా.

'మరి నువ్వు యింకా మొదలుపెట్టించలేదేం నాట్లూ?' అన్నాడు శివయ్యా.

'యింకా నీరెక్కండే! మీరో?' అన్నాడు సుబ్బయ్యా.

'మాదీ మీతోపాటే అవుతుందిలే. అన్నట్టు మంగి ఏమంటున్నదీ?' అన్నాడు శివయ్యా.

'అదా——! అబ్బే దాని మొగంజూసే నాలుగయిదు నెల్లయితే, ఆ రోజులన్నీ పోయినయిలే శివయ్యా, యిప్పుడేందో మనదార్న మనంపోతే బాగుండు ననిపిస్తున్నది' అన్నాడు సుబ్బయ్యా.

'అబ్బొచ్! యీ సుబ్బయ్యా పెద్దమడిసైతుండట్టుందే! ఓరి పోరా నాకాడంట నీసార్యా? కిందట నూర్పిళ్ళప్పుడు కదంట్రా మంగిని ఆ డొంకలకాడ దారి దప్పించి మీ సాయిడీ లోకి తీసికెల్లిందీ!' అన్నాడు శివయ్యా.

'సరేలే! యింతే నన్నమాట నీకు తెల్సింది! దానంతట అదేగా ఎంటపడిందీ!' అన్నాడు సుబ్బయ్యా.

'ఓరి పోరా నీ మాటలకేం వొచ్చిందీ! మంగి సంగతి నాకు తెలియదూ, లబోయ్ దిబాయ్ మంటూ అదావజాన ఏడ్సిబోతే?' అన్నాడు శివయ్యా.

'నీ కాడికొచ్చి ఏడ్సుకుండదేం? ఓరి పోరా నువ్వుమటుకు దాన్ని వూరకనే పోనిచ్చావంటా?' అన్నాడు సుబ్బయ్య.

'నేనా-! తెలవక ఏదో ఒక్క-పాలి బుద్ది గెడ్డి తిన్నదనుకో. ఎట్టయితే యేం అదేం ఆశబెట్టావో ఏమో సివరకి అది ఎటూ గాకుండా ఎల్లి, ఆ ముసలోణ్ణి పెళ్లిజేసుకుండె!' అన్నాడు శివయ్య. 'సరే, దానికి ఆ ముసలాడే దేముడికిమల్లే వుండే! పోనిద్దూ యిప్పుడెందుకొచ్చింది ఆ పాతపురానమంతా,' అన్నాడు సుబ్బయ్య.

'నిజమంతే ననుకో,' అన్నాడు శివయ్య.

'రత్తి బహుగెట్టిది – అది నడకెట్ట నడుసుద్దో సూశావుగా?' అన్నాడు సుబ్బయ్య.

'సూసేతలికే కరెంటుకొట్టినట్టు తల్దిరుగుతే?' అన్నాడు శివయ్య.

'అయినా వృత్త పిల్లముండలే?' అన్నాడు సుబ్బయ్య.

'యియ్యాలేగా అది కోకగట్టింది?' అన్నాడు శివయ్య.

'అంతేననుకో నీకాడ చేబోలు వువాకుండట్టుందే-?'

'కావలెట్టా?'

'కావాలా-? తేతేతే-'

* * *

తెల్లారి సింగారిచ్చుకు నాటు కెల్లిన రంగుకోకల కూల్జనం మాపిటేలకి పంటకాలవలకాడ, సెరువు సెప్టాలకాడ, వొంటిమీన ఆడీడ కొట్టుకుండ బురద – కాళ్ళ కడాలూ, సేతిగాజులు సుబ్బరంగా కడుక్క-ని, గీగానుంటా కూలిగింజలు కొలిపిచ్చుకునేవోరూ, యింటికాడ పిల్లోళ్ళేడుత్తా వుంటారని అటెటు

లగెత్తేవోళ్ళూ, బుడలోకి మిరపగాయ బొరపగాయలనీ, ఎర్ర గెడ్డ తెల్ల గెడ్డలనీ, మరసనాటికి గొబ్బరిసవ్వఁకు ఎట్టననుకుంటా చీసాకాయిలకి లగెత్తేవోరూ, మొగోళ్ళకి పువాకనుకుంటా, బుడ్డోడికి కాత్తేమన్నా పెట్టమంటా ఊళ్ళో ఆమూల, యీమూల, కోవటికొట్లకాడ కాళ్ళకడాల మోత బుట్టిచ్చి, సివరకి తోలేసినట్టు ఎటుజనం అటు సల్లసల్లగా గూడెం సేరుకుండారు.

కొత్తగా కోకగట్టి జనం మద్దెకొచ్చిపడ్డ రత్తికి ఆయాల మనసంతా - బిర్జిమీన రవిలుబండి లగెత్తినట్టు - కొట్టుకుంది. అదేందో రాత్తామీన నడుత్తున్నంతలెక్కా పక్కపక్క అరుగులమీన, సెట్లకింద కూకుండ మొగజనం రెండేసి రెండేసి బారల ముల్లుకర్రలు దీసుకుని తన ఎర్రకోకమీన పొడుత్తా వుండత్తే అనిపించింది రత్తికి. యీ మడుసులు తను యిన్నాల మించీ ఎరిగిన మడుసులు కారు. యీళ్ళ కళ్లు కోటయకొండ తిరనాల్లో వెలట్రీ దీపాలకిమల్లే దగదగ మెరుత్తుండయి.

'నాటేస్తున్నంత లెక్కా ఆ ఎంకట్రామయ్య పొద్దు తిరుగుడు పువ్వుకుమల్లె తనేటు తిరుగుతుంటే అటు తిరుగుతానే వుండాడు. అయినా ఎర్రకోక బొహు బాగుంది. చీతాయ్, ఎంకాయ్, యీరావుఁలు ఎర్రకోక ఎట్టుండా వుండదన్నారు. అందుకేగావాఁలు రాత్తాపక్క జనం అట్టాజూశారు? అయినా యిదేఁది పాడూ, కొత్తకోక కట్టుకుంటే పొడిసినట్టు ఆవజాన సూడాలెట్టా? చీ పాడూ, చిగ్గేసుద్దీ! అదేందిమరీ ఆ ఎంకట్రామయ్య యాడో జబ్బునపడి లెగిసినోడికిమల్లె అట్ట

జూత్తాడూ! నిజంగా అదేందో జబ్బే యీళ్ళకి - యేమో పాడు-' అని ఎట్టెట్టనో అనుకుండది రత్తి.

అయ్య బువదిని బయట మంచాం వేసుకుని సెంచుకర్ర వూదుకుంటూ కూకుండాడు. జేజి అమ్మకీ, పిన్నావుకూ, రత్తికి కంచాలు పెడ్తావుంది బువ దింటానికి.

ఆయాల్దాకా కుండలో గాబుల్లో పిన్నావుతో బాయి కాణ్ణుంచి నీలుదెచ్చి పోత్తావుండ రత్తికె తెల్లారినాట్లకు తన కొత్తకోకమీన బురదమచ్చ లుంటయ్యనిపించింది.

'అమ్మోవ్, సెరువుకాడ కోక జాడిచ్చుకొత్తానే!' అమ్మ నడిగింది రత్తి.

'యీవర్దాకా ఏంజేశావే - తెల్లారి జాడిచ్చుకుందు వులే' అంది అమ్మ.

'నాటు కెళ్ళేయాలకు ఎట్టారుద్దమ్మా! దొబ్బ నెల్లొత్తా నమ్మా' అంది రత్తి.

'ఓ యబ్బో! కొత్తకోక గట్టిందిగాని నాటెయిదు గావాల యీపిల్ల! ఏం అదిరిపత్తుండదమ్మోవ్ నీ కూతురూ! యిగ సాల్లే సంబడం, పెట్టెలో దాసుకో పండక్కి బొండ కట్టంటూ కట్టుకుందువుగాని. యియ్యాల కట్టుకుండది సాల్లే - నిచ్చేపమంటి కొత్తకోకనిగాత్తా బురదనీలల్లో పొల్లిచ్చుద్దంట సూడమ్మోన్ నీ కూతుకు!' అంది జేజి.

'ఆఁ, యీవిడే మాగాంగా కొనిబెట్టింది; మా అయ్య నడిగి నే నింకోటి కొనిబెట్టిచ్చుకోననుకుండావా?' అంది రత్తి.

'అయ్యో వగలూ! మీ అయ్యొకటి కొనిబెడ్తే నీ మొగుడెన్ని కొనిబెడ్తాడే పిల్లా?' అంది జేజి ముచ్చటగా.

'తెల్లారి లెగుత్తే యీయిడ కెప్పుడూ మొగుళ్ళే - సూడమ్మా!' అంది రత్తి.

'అమ్మ బుల్లో! యిప్పట్నుంచి ఏం ఎగిరిపత్తుందదమ్మోవ్, నీ కూతురూ! సూత్తుండావుగా, యిప్పుడెల్లి ఆ చెరువుకాడ కోక జాడిచ్చొద్దంట నీకూతురు!' అంది జేజి.

'అయితే నువ్వు కూడు దినవంటే రత్తి, మేం కూకుంటుండాం, యామోనమ్మ యీపిల్లతో సావుగుండది,' అంది అమ్మ.

'దానికి కోకతోనే కడుపు నిండుతుండె,' అంది పిన్నాం, కంచాంకల్లి సూత్తా.

'రేపుటికి పరికినీ కట్టుకోరాదంటే? యిప్పట్నుంచీ కోక లేందమ్మా యీ పిల్లకూ?' అంది అమ్మ.

'యిగ సాల్లే వూరుకో! యింకా పరికినా లేపిచ్చొద్దంట యీవేందో! పిన్నాం కోకేవన్నా కట్టుకుందువులే యిప్పుడేడకి బోతావు నీకట్టో,' అంది జేజి.

'ఆడ నాకుమటుకేం వుండయ్యావమ్మోవ్ కోకలూ,' అంటన్నది పిన్నాం.

'వుప్పుడు నీ బంగార మేం పీక్క దిన్లేములే నువ్వు వూరుకోమ్మా. గాబుకాడ దొబ్బున జాడిచ్చుకురారాదంటే యాడికో వుప్పుడు పడిబోకబోతే?' అంది అమ్మ.

'సచ్చేట్టు దెచ్చిన నీలన్ని వుప్పుడీమె కోకలు జాడిత్తా కూకుంటదిగావాలు?' అంటున్నది పిన్నాం.

'నువ్వేమ్మా తెచ్చిందీ? సూడమ్మా-?' అంటన్నది రత్తి.

'యిగ యియ్యాల యీాళ్ళతో కూడుదిన్నట్టే! గబగబ బావికాడ కెల్లి రెండుబుంగలు నీలు దెచ్చుకుని యీాడే గుంజకో రాదంటే కోకా - ఎల్లవేందే రత్తాం?' అంది అమ్మ, పేసీ లెందుకంటా.

'ఆవ్!' అంది రత్తి బుంగ సేతబట్టా.

'పిల్లముండను ఒక్కత్తెనే సీకట్లోపంపుద్ది?' అంది జేజి.

• 'హూఁ, నంగనాసి- నే లెగవలేనమ్మా వుప్పుడు-అసలే వొల్లంతా యిరగ్గొట్టినట్టుంది,' అంది పిన్నాం.

'నిన్నెవురేం రామన్లా పాపం-' అంటన్నది రత్తి.

'యిదిగో రత్తాం' అంటా యిసుగుతో అమ్మ లెగవక తలికే బయట సెంచుక్రం మైకంలోపడ్డ అయ్యని దాటి రాత్తా మీానకొచ్చి వాలింది రత్తి బుంగా, సేదతో.

పెయ్యదూడను పాల కొదిల్నట్టు - మద్దె మద్దె ఆరీసు సూడకుండా - ఎగిరెగుర్తా గబగబ బాయిదెగ్గిరకి పేర్తావుండ రత్తికి, ఎంకట్రామయ్య గొడ్డసావిడికాడి కొచ్చేతలికి తత్తర బుట్టింది.

'ఎవరా ఎల్లేది?' అన్నదా యిగ్రహం దారిమయీాని కొచ్చి నిలబడ్డా. అది ఎంకట్రామయ్య కంటం. మట్టిబుంగ తాప్పున బూమ్మీానపడి ఎయ్యిసెక్కలుగా పగలాల్సిందిగాని- తెప్పకొయ్యని కరుసుకుండట్టు కర్సుకుంది బుంగకు రత్తి.

'ర-ర-ర-ర-త్తిని-' మాట కొట్టుకుంది రత్తికి.

ఎంకట్రామయ్య 'ఎందుకో సప్పరిత్తుండా డనుకుంది రత్తి.

'యాాడికో ఎగురుకుంటా పోతావుండావే - ఎనక మీా జేజి లేదెట్టా?' అన్నాడు ఎంకట్రామయ్య సేతులు పిసుక్కుంటా.

'కోకజాడిచ్చుకోను - దొంబ్బన - ఎల్లమంటేనీ-' రత్తి నాలిక మడ్తబడింది.

'యిగనేం - యిదిగో-' సీకట్లో అటిటు సూశాడు ఎంకట్రామయ్య.

'ఆఁ-?' అంది రత్తి.

'కాత్తె నీతో పనుండదే-'

'ఓమ్మో-!'

'ఎహె ఊరకనేలే అరవమాకా - యిప్పుడే ఎల్లువు గాని, సాయిట్లోకి వొత్తావెట్టా-?' ఎచ్చగా ఎంకట్రామయ్య సావిడి గోడసాటుకు లాగాడు రత్తిని ఏంలేదంటా.

'ఏంచీ - యాడికో అట్టగుంజుతాడేం - యిదేందమ్మో-వామ్మో-' ఎంకట్రామయ్య కళ్లు వెలట్రీదీపాలకిమల్లే అట్టెలిగినయ్యో లేదో, యిదిలించి దూసుకుండ దూసుకోటం- ఎల్లి బాయికాడ ఆవురావురుమంటా పడ్డోసెళ్ళ నీలుతాగిన రత్తికి వొల్లంతా సెమటలుబట్టి గుడ్డల్లడిసినై.

'ఎవురు - ఏంది రత్తోవ్ అదేమొయిన నీలు దాగుతుండావ్?' అన్నది నీలకొచ్చి నిలబడ్డ చీతాం,

'ఎవరు - చీతాం - యదవ - సెడ్డదప్పికయిందే చీతాం - చీతాం -?' అంది రత్తి దడదడమంటా.

'ఏందే రత్తి?' అంది చీతాం.

'నువేనా, యింకా ఎవురో అనుకుండాలే - దొంబ్బన నీలు లాగమ్మో యిద్దురం కాత్తెలెక్క కల్చెల్దాం -'

చీతాన్ని సాటుజేసుకుని ఎంకట్రామయ్య సావిడిదాట్న రత్తి యింకాత్తెలెక్క బొయినాక యిగ పరవాలేదనుకుంటా

చీత్కాంతో సీలి గబగబ యింటికి మల్లింది ఆడీడ ఎల్దురు సూసుకుంటా.

గబగబ యీది మలుపుకుండా వొచ్చి - పాలుగు దిగేసి నట్టు అటనే నిలబడిపోయి - అట్ట మొగంమీనకి తొంగిసూసిందా యిగ్రహం.

'ఎవురూ - ?' అంది రత్తి, చినిమా జూసినట్టయి.

'నే సుబ్బయ్యాన్నే - మా శివయ్యేమో ననుకుండా లే - నువు రత్తివెట్టా ?' అన్నాడు సుబ్బయ్యా జడుగుతా.

'వుండు ఎల్లాల -'

'ఎల్దువులే -'

'యిగ సాల్లే లెగు -'

'ఎవురయా లేల్లే' - అంటన్న సుబ్బయ్యాకు పటపటపట నరాలు తెగినట్టయి సేతులు లెగుత్తుండయ్యో లేదో -

'టాప్' మని యీపుమీద పెట్లదిమ్మ మోగేతలికి - బత్తా ఎత్తేసేనట్టు - బూమ్మీనకి పల్టీకొట్టి పొందుకుండాడు సుబ్బయ్యా.

'యదవా !' అన్న దాయిగ్రహం సుబ్బయ్యాను వొంగిసూత్తా.

'ఓరి శివయ్యోవ్ - సత్తిన్నా -' అని మూలిగాడు సుబ్బయ్యా యీపుమీన సేతుల్తో అటనే లెగిసి కూకుంటా.

'ఎవురు సుబ్బయ్యా - సచ్చావ్రా నాయినా -' గబగబ సుబ్బయ్యాను వాటేసుకుని లెగవదీశాడు శివయ్యా.

'యిదేందిర శివయ్యోవ్ -'

'అరెరెరె – ఎంకట్రామయ్యా ఏటుకు సచ్చాడనుకంటిని గందట్రా సుబ్బయ్యా –'

'పొళ్ళొద్దన్నండ్రా – కాత్తె వాటేసుకోరా నాయనా–'

*　　　*　　　*

ఆ రేత్తిరి ఎర్రకోళసుట్టూతా వెలట్టీదీపాలు గిర్ గిరా తిరుగుతూ టావ్ టావ్ మంటా పగుల్తుండట్టు కలగంటన్న రత్తి సుట్టూసల్లగా లెగిసిన జేజి యింత వుప్పుగల్లుదిగదుడ్సి బారేసింది.



# పాలెంలో బొమ్మలాట

ఎంకటసుబ్బయ్యగోరి బుడ్డజీతగాడు సూరాయి నెత్తిన కండవా ఏసుకుని ముక్కు ఎగదోసుకుంటూ లోన ఏందేందో గొనుక్కుంటూ సత్రంకాడ రావిసెట్టుదెగ్గిర కొచ్చేతలికి ఆడ తోలుబొమ్మలాట పందిరి అప్పుడే లెగిసి కూకుండది. పందిరి అట్ట సూసీసూడకతలికే నీలకుండ పగిలి నీలుకార్నట్టు సూరాయి పానం ఆటనే దిగిజారిపోయింది.

అసలు సూరాయి యిసువంటి బొమ్మలాటలు సూసే పద్దతే వేరు. బొమ్మలాట ఆడేనాటికి పద్దినాల ముంగల బలానిదినం బలాని సోట, బలాని ముటావోరు, బలాని తోల్బొమ్మలాట ఆడ్తారని వూరికి ముంగల సూరాయి పెతోరికీ సెప్పాల. ఆ మయిన ముటావోరు వూళ్ళో కొచ్చి దిగినాక ఆ రందర్తో పరాసికాలాడ్తా, దెగ్గిరదెగ్గిర తిరిగి పందిరి ఏసేయాలా, బొమ్మలాట మొదలు బెట్టేముంగలాకుర్ర సంచును పందిరి సాయలకు రానీకుండా ఓ కోపు కాత్తా, మద్దె మద్దె ముటా నోర్కి వుసారెక్కిత్తా వుండాల. అసువంటి పద్దతి యిప్పుడు పెడదిరిగింది.

ఎప్పుడో పద్దినాలకి ముంగలే తెల్సింది సూరాయికి నాంచారిముటా వొచ్చి పాలెంలో సత్రంకాడ రావిసెట్టుకింద బొమ్మలాట ఆడబోతుండారని. ఈ సమాశారం అట్ట

తెల్పిందో లేదో ఎంటనే సూరాయి గెహించాడు. అయ్యో తనిని ఎంకటసుబ్బయ్యగో రెంటో జీతానికి కుదుస్తా ఆరి గొడ్డ సాయిట్టో గొడ్డతోబాటు కట్టేసి పొయ్యాడని;

కన్నీకటి పడేయాలకి పుగాకుపాయలు సీల్సుకుంటా ఎంకటసుబ్బయ్యగోరు పాలెంలో బొమ్మలాట యవారాలేందో యిశారిద్దామని బయలెల్లి అట్ట మలుపు తిరిగాడో లేదో సూరాయి గొడ్డసాయిట్టోంచి సల్లగా జారి సత్రంకాడికొచ్చి నిలబడ్డాడు.

తెల్లారి నాంచారి ముటా సెరువుగట్టుమీనకుండా పాలెంలోకి రాటం గొడ్డసాయిడి గోడెక్కి ఎప్పుడో సూశాడు సూరాయి. ఇంకూసేపటికి నాంచారి ముటా బాపనయ్య బజాన్లోకొచ్చి వొత్తావుంటే ఎనికెత్తే కొండాయ్, కోటాయ్, కాంతాయ్, రంగాయ్, రత్తాయ్‌ల్తోబాటు జడెగెస్కుంటా సీతాయి రావటం సూసిన సూరాయి సాయిడిసూరుకు అటనే కరుసుకపొయ్యాడు.

నాంచారి ముటా పాలెంలోకి జేస్టట్టు తెలిసి మోత లెగిసి పోతావుంటే, యీడ గొడ్లసాయిట్లో సందేలదాకా నెవరేత్తా కూకుండ సూరాయి ఎంకటసుబ్బయ్యగోరు అట్టఎల్లి సందు తిరగనే తిరిగేతలికి కూతకూసి ఎలకాడకొచ్చిపడ్డట్టు సత్రంకాడికొచ్చిపడ్డాడు.

అయితే ఏం-పందిరి అప్పుడే లెగిసి కూకుండది. తన సెయి తగలందే ఆ పందిరి లెగిసి కూకుండది! మందనించి దారి దప్పిన దూడకిమల్లే పందిరి సుట్టూతా సూత్తుండ సూరాయికి పందిరికి కాత్తె పెడగా కోపుగాసిన పోలీసులకిమల్లే కొండాయ్,

కోటాయ్, కాంతాయ్, రంగాయ్, రత్తాయిలు సోల్పన నిలబడుంటం పయినంగా అగుపించింది. ఒక్కపాలి యీపుమీన బురదమట్ట పాకినట్టయింది సూరాయికి.

అయ్య తనని ఎంకటసుబ్బయ్యగోరి గొడ్డసాయిట్లో కట్టెయ్యకనేబోతే తనకన్న ముంగలగా కొండాయి ముటా ఆవజాన ఆడ నిలబడుండేదేనా ?

"ఆర్నీ సూరాయ్ !" అని అరిశాడు కొండాయి.

"ఆర్నీ సూరాయ్!" అనరిశారు కోటాయి, కాంతాయ్, రంగాయ్, రత్తాయిలు.

"ఆళ్ళదే యీడ పెత్తనం. తనని పదామడ ఎనిక్కి నెట్టారాళ్ళు" అనుకుండాడు సూరాయి.

"ఓరి ర్రారార సూరాయోవ్!" అనరిశారు కొండాయి ముటా.

"ఆళ్ళయ్యోళ్ళు ఆళ్ళని యాడికిబోతానంటే ఆడకి పోనిత్తారు. ఆళ్ళయ్యోళ్ళు మంచోళ్ళు" అనుకుండాడు సూరాయి.

"ఇంటి కెళ్లి యిప్పుడే వొత్తాలేరా !" అంటా సూరాయి అట్ట ముంగలికి ఒక్క అడుగు ఏశాడో లేదో లంబాడి కొట్టుపక్కనించి కక్షికిమల్లే వొత్తుండ ఎంకటసుబ్బయ్య గోప అట్ట అగుపించేతలికి, యిగ అట్టనే ఎనిక్కి తిరిగి లగెత్తిన లగెత్తడంర త్తమ్మసందుమలుపుకాడికొచ్చిపడ్డాడు సూరాయ్.

"ఒరేయ్!" అంది మలుపు మొత్తనుండ ఆ యిగ్రహం.

"అమ్మ సత్తినోరయ్యో"- అంటా అటనే ఆ యిగ్గహం మిన్నానకు వోరిగాడు సూరాయ్ సీకట్లో ఏది ఏదయిందీ తెలవక.

"అమ్మ సంపావురా సూరాయో" అంది ఆ యిగ్గహం సూరాయిని గెట్టిగా వాటేసుకుంటూ.

"ఎవరూ!" అన్నాడు సూరాయి యిగ్గహం జడ సేతికి తగిలేతలికి కాత్తె తెప్పరిల్లుకుంటూ.

"సీతాయిన్నా నేనూ, సంపిటివిగదంట్రా సూరాయ్."

"సీతాయ్! నువ్వేనంటే?"

"నేనేరా సూరాయ్."

"ఆసి నువ్వేనంటే నిజంగా ? అడలుకుసత్తినిగదంటే దెయ్యం పీకనేపీకిందనీ-"

"ఛీ సచ్చినోడా అరవమాక."

"అవరన్లేయే సీతాయ్, ఇటిగో, ఏందే నువ్విడ సేత్తుండదీ ?"

"నువు అట్నుంచి లగెత్తుకురాటం సూసి యీడ యిట్ట నిలబడ్డానూ, ఆమైన నువొచ్చి మాట యినిపిచ్చుకోకుండానే మీదబడ్డివి!"

"సంపావుగదంటే !"

"సాల్లే వూరోకొ--ఇంకా మీనబడీ, సూడయ్యా పాపం!"

"తెలవలేదులేయే సీతాం - దెబ్బతగిలిందంటే ! పానీలే, మరి యెందుకే మూలనుంచుండావూ ?"

"నీకోసమే రా"

"నా కోసమంటే !"

"అవున్నా"

"ఎందుకే నాకోసం?"

"ఒరే సూరారావోవ్, నే బొమ్మలాట కెల్తుండాగా?" అంది సీతాయ్.

"యేందీ?" అన్నాడు సూరాయ్.

"నే నాంచారయ్య బొమ్మలాట కెల్తుండాగా! మా జేజి నన్ను తీసికెల్తానంది?" అంది సీతాయ్.

"నిజింగానంటే?"

"నిజంగానేరా, కావాలంటే మాజేజి నెళ్లిఅడుగు. తెల్సుద్ది."

"మీ అయ్య ఎల్లమన్నాడంటే?"

"అయ్యా, మా అమ్మా అంతా ఎల్లమన్నారు నన్ను."

"పానీలేవే సీతాం, నీకేం, నువ్వు ఎట్టనన్నా ఎల్తావు."

"అదేందిరా సూరాయ్? మరి నువ్వుగూడా రాటం లేదంట్రా?"

"మా అయ్య నన్ను పోనీయడు."

"ఎందుకని పోనియ్యడ్రా మీ అయ్య నిన్నూ?"

"ఎంకట సుబ్బయ్యగోరి గొడ్లసాయిడి యిడిసి రావద్దంటాడు."

"అదేందిరా? బొమ్మలాటన్నా సూడనీయడంట్రా మీ అయ్య?"

"నీకు తెలవదు లేయే మా అయ్యసంగతీ."

"మొగులు నీ వడిగావంట్రా మీ అయ్యనూ?"

"నే నడక్కేం! ఎందుకనమ్మా, నాలుగు తన్నించు కోనా?"

"వృత్తినే తంతాడంట్రా మీ అయ్యా?"

"వృత్తినే ఏం తంతాడో తెలువదుగాని - ఎట్టానబ్బా?"

"ఎట్టనేందిరా ఎల్లి అడక్కా, మొగులు అడక్కుండానే ఎట్టానంటాడేం? ఒరేయ్ అంతమంది బొమ్మలాట సూత్తారు, నువు సూత్తే మీ అయ్య తప్పంటాడంట్రా?"

"అనడనుకో, మరి యీ ఎంకటసుబ్బయ్యగోరి గొడ్డ సాయిడి సంగతేమంటా?"

"ఆళ్ళుమట్టుకు రారంట్రా బొమ్మలాటసూడనూ?"

"ఎందుకు రారూ! ఆళ్ళొచ్చి నన్ను గొడ్లసాయిట్లో పండుకోమంటారు."

"ఏందిరా అనేది, ఆరి గొడ్లసంగతి ఆరికన్న నీ కెక్కు వెట్టా?"

"బలేదానివే యింకా నయం! అయితే నాకు డబ్బిచ్చి జీతానికి పెట్టుకుండది పని ఎగ్గొట్టమనెట్టా?"

"ఎవు రన్నారూ, రేత్తిరి గొడ్డు నిదరబోతుంటే నువ్వాడ దేనికంటాకుగానీ? ఒరేయ్ బొమ్మలాటన్నా సూడక బోతే యింగ నువేం మన్సివిరా?"

"అదే సూత్తుండా. పేసీ వొత్తే ఎట్ట నబ్బా-?"

"ఎహా ఏం పేసీ రామలే. ఒక్కపూట - అందుట్లో యిట్టాటి సమయంలో-ఎల్లి అడగరా మీ అయ్యనీ! మీ అయ్య మంచోళ్ళేరా నాకు తెల్సా."

"ఏం మంచో నాకు తెలవటంలా-"

"సక్కగా మాజేజి వొళ్ళో పొండుకుని, తెల్లార్లా బొమ్మ లాట సూత్తా" అంటున్నది సీతాయి.

"ఆఁ, సూశావులే" అన్నాడు సూరాయి.

"రావణాయుద్ధం సెబతాడంట నాంచారయ్య! అబ్బ! నువ్వు శెలగాల్సిందేనంట! నాంచారయ్య అల్లుడు కేతిగాణ్ణి పట్టే కడుపుబ్బిపోవాల్సిందేనంట! నాంచారయ్య పెళ్లాం బంగారక్క పాటలు బహు యిసురుగా పాడుద్దంట! సెన్నా పట్టందాకా మోత బుట్టిందంట నాంచారయ్య బొమ్మలాటంటే-" అనుకుంటున్నది సీతాయ్.

"ఇదిగో సీతామోవ్-"అన్నాడు సూరాయ్ కాకబుట్టి. "ఓరి పోరా; నీకన్న ఆకొండాయోళ్ళే నయం" అంది సీతాయి.

"యిదిగో! ఇయాల అరఅర బెమ్మదేవుంట అడ్డాం ఒచ్చి నిలబడ్డాచరే, యీ నక్కా సూరాయి బలాని సత్రం కాడ, రావిసెట్టు ఇవకాడ, ఏపసెట్టు వాలుకొమ్మమీన కూకుని, నాంచారయ్య బొమ్మలాటగనక సూడకనేబోతే - హా రాథణా! - " అంటా గిరుక్కున సెక్రం దిరిగినట్టు తిరిగి బఁయ్ మంటా యింటేపు లగెత్తుకెల్లాడు సూరాయి; సీతాయి అటనే నోరు దెరుసుకు సూత్తుంటే.

ఆమయిన యియాల బొమ్మలాట యవారం ఐసాపైసా తేలవాల్సిందేననుకుంటా వుసిమీన ఇంటికాడిదాకా వచ్చిన సూరాయి యింటిముంగల అరుక్కాడ అటనే జారిపొయ్యాడు, అంతరిచ్చాన దారం తెగిన గాలిపటానికిమల్లే.

ఇంటో అయ్య వుండాడు. అమ్మా, అయ్యా ఏందో జోరుమీన మాట్టాడ్తుండారు. ఇగ అటనే అరుగుమొత్తకాడ సీకట్టో నక్కాడు సూరాయి.

"ఏందయ్యోవ్ పెట్టిలోంచి ఎర్రకండవా తీత్తుండావ్ ?" అంటుండది అమ్మ.

"తీత్తే తీశాన్లేం నువాడ కూకో. పెళిదీ నీకు కావాల్సిందే నెట్టా ?" అంటుండాడయ్య.

"పెళిదీ ఎవురిగ్గావాలా? రేత్తిరిపూట పెట్టిలోవుండ ఎర్రకండవాతో ఏం పనొచ్చిందా అనడిగా, తప్పెట్టా ?" అంది అమ్మ.

"ఎవు డన్నాడు తప్పనీ. దురగమ్మకుమల్లే ఆ డేదో మూల కూకుండా వనుకుంటే అప్పుడే తగుల్కొంటివి. వూరకనే పెట్టిలో వుంటే ఏసుకుంటుండా. కొనుక్కు తెచ్చుకుండది ఏసుకుంటానికి కాదెట్టా ?" అన్నాడు అయ్య.

"ఏసుకుంటే ఎవురి కేం బట్టిందీ. ఇన్నాలనించి పెట్టిలో వూరకనే వుండదిగా. ఈ రేత్తి రేం పనొచ్చిందీ ?" అంది అమ్మ.

"బువ దిన్నాక ఎంకయ్య ఓపాలి రామంటే ఎల్తుండాలే–సానా పనుండది – నువ్వూరికే బురదమట్ట ఎగిరిన ట్టెగరమాక" అన్నాడు అయ్య.

"బురదమట్ట గిరదమట్ట అనమాక. అయితే ఎంకయ్య ఎర్రకండవా ఏసుకునిగాని రావద్దన్నా డెట్టా ?" అంది అమ్మ.

"ఏహె రమ్మన్లేదులే, రేక్కంప తగుల్కుండట్టు తగుల్కుండావు. పెట్టిలో సెదపురుగేమన్నా సేరిందేమోనని సూసి, పానీగండా అని వూరకనే కండవా ఏసుకుంటే రాగం మొదులు బెట్టావే యిడవకుండా ?" అన్నాడు అయ్య.

"ఆహాఁ, అట్టనా ! అయితే కూసేపుండు. నా ఆకుపచ్చ కోకగూడ సెదలేమన్నా పట్టినయ్యేమో సూడనీ–"

"సెదలేం పట్టలేదుగానీ ఇపుడు సీకోకలు గీకలేం తియ్యి మాశ-అహఁ-అదేందీ పచ్చకోక కట్టుకుంటుండవ్?" అంటున్నాడు అయ్య.

"వూరకనే కట్టుకుంటుండాలే. కోకలు కొనుక్కుండది కట్టుకుంటానిక్కాదెట్టా? వుండట్టా-" అంటున్నది అమ్మ.

"ఇదిగో - అదేందీ తలగూడ దువ్వద్దే - ఇదిగో ఏందమ్మోస్ నీ యవారం!" అంటున్నాడు అయ్య.

"యవారమా? సెబతాలే పద-"

"ఇదేంది-యాడకి అటుబోతావు తెలుపుకాడికే?" అంటుండాడు అయ్య.

"ఎంకయ్యకాడ నాకూ పనుంది. ఎల్దాంపదా" అంది అమ్మ.

"ఎంకయ్యా! ఎంకయ్య ఎవురూ? అయితే ఎంకయ్యని అట్టుంచు. ఇదిగో నమ్మోస్ నువ్వు బొమ్మలాట గిమ్మలాటకని పచ్చకోకగట్టి బయలెల్తుండావుగావాఁల మరదేందో-" అన్నాడు అయ్య.

"ఎంకయ్య ఎవు రంటంకాడికొచ్చింది? అయితే ఎర్ర కండవా ఏసింది బొమ్మలాటకాడికా అయ్యా? హుఁ అంత దొంగసాటుగా ఎల్లాల్సొచ్చిందా అయ్యా! నాకు తెలవదనుకుండా నీ పసిగాలూ-వుండు తెల్లారెగుస్తే మావూరు మాఅమ్మ అయ్యకాడి కెల్లకబోతే సూడు. ఎల్లకభోతే నాపేరు దురగమ్మ కాదనాల్సిందే. ఎంతన్యాయం! ఎంతమాయా! అన్నీ దొంగ మాటలే, అంతా బూటకమే! మామ్మా, మా అయ్యోగనక వుంటే ఈ మడిసి ఇట్టా జేత్తాడూ - హుఁహూఁ - అమ్మాఁ!"

"దురగమ్మ తల్లీ యాడవమాకే నీకు దణ్ణంపెడతా, బుద్ది గడ్డితిందిలేవే -"

"వుండూ - నన్నంటుకోమాకా - అమ్మా - "

"పెద్దగా అరవమాకే తల్లా - యీ సూరాయన్నా వొత్తే బాగుండు. యదవ రాడేం ఏ యాలకూ - బొమ్మలాట కెల్దాం యిగన్పూరుకోవే -"

"ఏం అక్కర్లా. నువే ఎల్లు ఎర్రకండవాళ్లో, సూరాయి, నేనూ ఎల్లుబోతే నీకేం."

"అహఁ, అదుగందుకే - ఎదవ పనేజేశా - యాళ్లో గజ్జల సప్పుడవుతుందే - యీ సూరాయివొత్తే బాగుండు. దబ్బున బొమ్మలాట కెళ్లొచ్చు - పాటలు యినొస్తుండయి మొదలుబెట్టలేదుగంచా - ఎవ్వురాడా- సూరాయ్ ? ఏందిరా తలకాయి లోనికిబెట్టి అట్ట సూత్తుండావ్రా - చా యదవా - దబ్బున రామంటుంటే - ఎంకట్సుబ్బయ్యగోరితో సెప్పొచ్చావంట్రా ?"

"మరే - ఆకు అెత్తేనీ-" అన్నాడు సూరాయి లోన కొచ్చి అటనే గోడకానుకుని యీపు రుద్దుకుంటా.

"చా యదవా-" అంటున్నాడు అయ్య.

"ఆడిమీాదికి లెగవమాక వృత్తపున్నానికి - యీ దుండదిరా నీ గళ్ళసొక్కాయా - ఎల్లి ఏసుకోవేందిరా!" అంది అమ్మ కళ్ళు ఆడిస్తా.

"ఆ పెట్టిలోవుంది ఏసుకోవేరా దొబ్బునా!" అన్నాడు అయ్య.

ఆమయిన బయల్దేర్దంబయల్దేర్దం దాన్లో అమ్మా అయ్యల్ని సందుసూసుకుని సల్లగా దాటేసి, బొమ్మలాట పందిరికి అసంట ఆల్ల జేజికాడ కూకుని అటేటు నిక్కినిక్కి జూత్తుండ సీతాయి జడతోక ఎనకామాలే ఎల్లి గబిక్కిన ఓగుంజుగుంజి, సెక్కలు, చీనారేకుడబ్బాలు దన్నామంటా కేళిగాడు, బంగారక్క తెరమీనకు వొచ్చేయాలకి; యాపసెట్టుమీన కూకుండ కొండాయి ముటాను ఎడాపెడా తోసుకుంటూ ఎల్లి సెట్టు మయాన వాలుకొమ్మమీన కూకుండాడు సూరాయి.



# తా సు పా మం

ఈకులపాడు వూ రెలుపల గెడకర్రలకిమల్లే కిక్కిరిసి నిలబడుండ తాడితోపుమయాన నాగుమల్లె సువ్వకిమల్లే పాంపుట్టలకాడ పాకుతుండ బసవాయిని గొడ్లమందకాడ పేడ కొచ్చిన ఎంకాయి దూరాన్నుంచి సూసుద్ది.

ఆ బసవాయి గిరజాలు అప్పుడే తెలుస్తాయి. ఆడి మెళ్ళో ఎండికంటె పదామడ దూరాన్నుండా తెలుత్తానే వుంటది. గెట్టిగా పంచబిగ్గట్టి నడుంకు ఆవజాన కట్టు బిగించేది వాడే వాడి మొల్తాడుకు అయిదుగెజ్జలు, రెండునల్లకుచ్చులు వేళ్ళాడేదికూడా ఎంకాయికి బాగా తెల్సు.

అయితే యీడకూకుండ ఎంకాయికి ఆడ పాంపుట్టల కాడ తచ్చాడ్తుండ బసవాయి అస లేం చేత్తుండదీ తెలవటం బహుకష్టం. అయినా ఎప్పుడు సూసినా ఏ ఎండ్రకాయ బొక్కలకాడో గెడ్డలుతీసుకుని నిలబడ్తావుండేవోడు, యియ్యాల వుండట్టుండి సాటుసాట్న ఆ పాంపుట్టలకాడ తిరగాల్సొచ్చిన పనేంది? ఆడ జనం ఎవురూ లేకుగందా? ఎంకాయి మదన్లోపడ్డది.

గొడ్డమంద గెనువులెంట, నీలగుంటలకాడ ఆటేదార్ని అవి తలలూంచుకుని తిరుగాడ్తుంటే మంద పిల్లకాయలు బిల్లం గోడు ఆడుకుంటూవుండాగు. అటేటు సూసి తోపులోకి సల్లంగా జారబడ్డది పేడపల్లెకతో ఎంకాయి.

అంత పట్టపగలయినా తాడితోపులోకి ఎల్లేతలికి గలగల మంటా దెగ్గిరదెగ్గిరగా వాలేసుకుండ ఆ తాడిసెట్ల సీడలు బూమ్మీనపడి కరవొచ్చే జడల దెయ్యాలకిమల్లె వుంటం అటుంచి ఏ బొక్కల్లోంచి ఎసువంటి జీవాలు తొంగిసూత్తా వుంటయ్యో ఎసువంటి మడిసికయినా తెలవటం బహుకష్టం.

అడుగులు జారకుండా, చుట్టుపక్కల భద్రంగా సూసు కుంటావొచ్చి బసవాయికి కాత్త వెనకన నిలబడ్డది ఎంకాయి. ఆడ బసవాయి వాలకం, అసలు ఆడేంచేత్తుండదీ ముంగలయితే ఎంకాయికి అంతుబట్టలా. ఓ సేతిలో చెంచొళ్ళ పాంకర్రా, రెండోసేతిలో గొబ్బిరిసిప్పా పట్టుకుని కోటయకొండపెబకు మల్లేవుండ ఆ పుట్టపక్కన మోకాళ్ళమీన వొంగి నిక్కి- సూత్తుండ బసవాయిని చూసి కూసేపు అటనే నోరుదెరిసింది ఎంకాయి.

మొదలు ఎవురన్నా మాటలమయాన పాము లంటుం టేనే వాళ్ళుగరిపోడుసుద్ది! అసువంటిది అసలవి నిజంగానే పొందుకునే అంతలావు పుట్టా, అన్ని బొక్కలకాడ - ఎచ్చగా లోనుంచి ఆవిరికొడ్తుంటే - ఏ మడిసయినా ఆవజాన ఆడ వొంగి తొంగి సూత్తుంటం ఏ ఆడగూతురుకయినా ఎట్టుంటదీ?

"ఓ శేయ్ !-" అని గుటకమింగింది ఎంకాయి.

నిశిర్కేత్రి, నిదర్లో ఎవురయినా ఏడు సముంద్రాలు దాటి, మూడడవుల్ని ఏటుకునరికి, కుప్పేసి, నాలుగోఅడివి మయా నుండ మర్రిసెట్టు తొర్రకాడ నిలబడి అరవకుండా తొంగి సూత్తుండే యవదానంలో - గబిక్కిన యీపుమీన పెటీమని సరిచి సిటారుగా కూకోబెట్టి నిదర్లేపుతే ఎట్టుంటదో అట్టయి

పోయి - గబిక్కిన ఎనిక్కి ఒక్క గెంతేసి నిలబడి ఎంకాయిని సూశాడు బసవాయి.

"ఆఁయ్-?" అన్నాడు బసవాయి నోరుదెరిసి.

పళ్ళిక నెత్తినబెట్టుకుని, కోక పైకెగ్గట్టి, ఆవజాన నోరు దెరుసుకు సూత్తుండ ఆమడిసి గంగానమ్మతల్లనుకుండ బసవాయికి యింకూాస్సేపటికిగాని ఎంకాయి ఎంకాయికిమల్లే అగుపించలా.

మొన్నిమద్దె బెవ్వాలాట్లో తేలుకొండె జడతో ఎఱ్ఱ ఎంకాయి, వుండట్టుండి కోకెగ్గట్టి ఆవజాన ఆడ నిలబడేతలికి శాసబిగిసి గుటకమింగాడు బసవాయి.

"ఒరేయ్ ?" మళ్ళీ అంది ఎంకాయి.

"ఆఁ ?" అన్నాడు మొకంతిరగని బసవాయి.

"ఏందిరా నువ్వుసేత్తుండదీ ?" అడిగింది ఎంకాయి.

"ఎవ్వురూ - నేనా ? - అయితే ఏంలే -" అంటున్నాడు బసవాయి.

"అయితే ఏంలే అంటాడేం ! -" అంది ఎంకాయి.

"కాత్తె పనిమీానుండాలే -" అన్నాడు బసవాయి.

"అబ్బో కాత్తె సెప్పగూడదట్టా ఆ పనేందో ?" అంది ఎంకాయి.

"ఆఁ, అదే అనుకుంటుండా -" అన్నాడు బసవాయి.

"అబ్బో మాటలు నేర్చావే నాయనా ! యాడకి పోయినావయ్యా యిన్నాలమించీ ?" అంది ఎంకాయి.

"ఎటో పోయినాలే -"

"చరే, యిగనేం-" పళ్ళికకిందపడేసి కూకుండదిఎంకాయి.

"నీకో నా కెందుకొచ్చింది, యిపకాడ సానాపనుం డది నాకు," అన్నాడు బసవాయి, ఏం పట్టించుకోనట్టు పుట్ట కాడ తిరుగుతూ.

"ఎవురొద్దన్నారూ, వుంటే చేసుకోరాదూ?" అంది ఎంకాయి.

"అసలు నువ్వు యిటు ఏం పనిమీద వొచ్చినట్టూ?" అన్నాడు బసవాయి పాంబొక్కలోకి తొంగిసూత్తూ.

"ఒరేయ్, ఒరేయ్ ఏందిరా నువ్వాడ తొంగిసూసేదీ," అంది ఎంకాయి వుండబట్టలేక.

"పాముల్లే–" అన్నాడు బసవాయి అటనే తొంగిసూత్తూ.

"పామునీ! ఎందుకురా పామును తొంగిసూట్టం? అవి మంచివి కాదంటరా!" అంది ఎంకాయి.

"పనివుందిలే," అన్నాడు బసవాయి.

"ఏం పనిరా, కాత్తెసెప్పవంట్రా!" అంది ఎంకాయి.

"పామును పట్టుకుంటుంన్నాలే" అన్నాడు బసవాయి.

"ఆఁ, నిజంగానట్రా! పోరా నీ బడాయిలు నాకా డంట్రా! నీలాంటోళ్లు యింగా పదిజనములెత్తాల పామును పట్టుకుంటానికి" అంది ఎంకాయి.

"బడాయిలా? చూస్తావా, మరీ పడ్తానో లేదో? హుఁ! యీ బసవాయంటే అంతే ననుకుండావుగావాల్ను."

"యిగ చాల్లే యిపకాడికి రారా, పెద్ద పామును బట్టే మొగోడివి నేటిగ్గాంగాబయద్దేరావుగ నీ. సానాసూశాం యిట్టా టోళ్ళని. ఒరేయ్ ఎండ్రకాయలు పట్టుకోక ఎందుకొచ్చిం దిరా నీ కాపనీ?" అంది ఎంకాయి.

"నువు సూశావా నే నెంౘ్రకాయలు పట్టటం?"

"సూశానా యింగా సూశానా? హుఁ! నాకు తెల వకపోద్దగా నీ సంగతీ?" అంది ఎంకాయి.

"ఏందమ్మో నీకుదెల్సిందీ? శాపలుగదూ నేను పట్టు కునేదీ? కావాలంటే ఎల్లి అడుగు ఎవుర్నయినా."

"ఒరేయ్, సిన్నప్పుడు నువు ఎంౘ్రకాయల్ని పద్దాకా గెడ్డలుదీసుకుని కొట్టేవోడివిగావంట్రా?" అంది ఎంకాయి.

"సిన్నప్పుడు నీకు తేలుకొండెకిమల్లే జడ వుండేదంటనే యిప్పుడది యాడకి పోయిందమ్మా?"

"ఓ బసవాయోవ్, నా చంగతెరగవు తెల్సిందా?"

"మరి యింకేం! అట్టనే అనుకోరాదూ నేనుకూడా. హుఁ! అంతలావు ఎగతాళిగా వుండదిగా!"

"అబ్బో మాటలు సానా నేర్సావే!"

"హుఁ! ఆడ నీకే మాటలొచ్చింది. నీ కన్న యీడ ఎవురేం తక్కువతిన్నా— నాతో నీకె దుకొచ్చిందిగానీ యివ కాడ సానాపనుండది నన్ను పలకరిచ్చమాక" అని మళ్లీ పాం బొక్కలోకి తొంగిసూత్తుండాడు బసవాయి.

"ఒరేయ్, ఒరేయ్ బసవాయ్?"

"ఏం?"

"ఎందుకురా నీకు పాములజోలీ? అవి ఎసువంటివో నీకు తెల్సా?" అంది ఎంకాయి.

"హుఁ! యీ బసవాయికి అన్నీ తెల్సు, యియ్యాల వైద్దిశంలోకి గరగళం తెచ్చిత్తే అద్దరూపాయి డబ్బులిత్తా నన్నాడు రాంబెమ్మయ్య" అన్నాడు బసవాయి.

"గరగళం! గరగళం ఏందిరా?"

"తాచుపాం గరగళం" అన్నాడు బసవాయి.

"తాసుపాం యిసమంట్రా! ఓమ్మో, అందుకంట్రా యీాడ నువ్వు తిరుగుతుండదీ?"

"బలేతాసుపాములుండయిలే ఈడ!" అన్నాడుబసవాయి.

"గట్టిగా అరవమాకరా! నీకు నిజంగా శాతవునంట్రా ఆట్ని పట్టటం?"

"హుం! అదొక లెక్కా-జమా! మా అయ్యోళ్ళు ఆట్ని మిడతల్ని పట్టుకున్నట్టు పట్టుకుని, నడిబజార్లో ఆట్ని మెల్లోళ్లు కట్టుకుని తిరిగేవాళ్ళు!" అన్నాడు బసవాయి.

"ఆళ్ళు పెద్దోళ్ళురా! ఆళ్లు ఏం చేసినా చెల్లుద్ది! ఆళ్ళ కాడ మంత్రకట్లుండేవంట!"

"అంతావుత్తది. వుత్తదైర్నంమీాద పట్టాల్సిందే ఎవురు పట్టినా" అన్నాడు బసవాయి.

"నీకు దైర్నం వుండదంట్రా?"

"ఎవరికి—నాకా? వుందో లేదో యిప్పుడు తెలుసుద్దిగా" అన్నాడు బసవాయి.

"అద్దరూపాయి డబ్బులంట్రా రాంబెమ్మయ్య యిచ్చేదీ?" అంది ఎంకాయి.

"ఆడు అంతకన్నా యిచ్చిసావడు. సచ్చినోడి పెళ్ళికి వొచ్చిందేసాలు."

"పానంకన్నా తీపంట్రా అద్దరూపాయీ? అసలు తాసు పాం ఎంత సెండాలపుదో నీకు తెల్సా? రాంబెమ్మయ్య నిన్ను మాయసేత్తుండాడ్రా" అంది ఎంకాయి.

"ఇదిగో ఎంకాయోవ్, అర్ధరూపాయిలో నీకుపావలా బిళ్లయిత్తా" అన్నాడు బసవాయి.

"సీ పాడూ - నాకేం అక్కర్లే ఎదవ డబ్బు-"

"నువ్వు సిన్నప్పుడు ఓనాడు మనం కోతికొమ్మజ్జల్లాట ఆడుకుని యింటికి తిరిగొత్తావుంటే సింతలతోపుకాడ నన్ను సాటుగా పిలిసి ఓ పావలాబిళ్ల సంపాయించుకురామంటివే!" అన్నాడు బసవాయి.

"అప్పుడంట్రా! పోరా నీ దంతా! అప్పుడు సెంచయ్య కొట్టోకి సబ్బిళ్లలొత్తేనీ - ఆశపుట్టిందిరా - సీ పాడూ! అదెప్పుడో సిన్నప్పుట్లేరా. ఇప్పుడు సబ్బిళ్లమిద్దుకుంటే మాజేజి సంపుద్ది" అంది ఎంకాయి.

"అప్పట్నుంచీ ఎప్పుడిద్దామనుకుండా ఓపావలా బిళ్లనాకు సిక్కకుండావుందే ఎంకాయ్" అన్నాడు బసవాయి.

"పోనీలేరా ఎదవ పావలాబిళ్లా-"

"ఆఁ, అంతేనా! డబ్బంటే అంతసులకనగా తోసెయ్యమాకేవ్. యియ్యాల బెమ్మదేవుడు దిగొచ్చినాచరే ఆ రాంబెమ్మయ్య దగ్గిర్నుంచి అర్ధరూపాయిబిళ్ల రావాల్సిందే, నువ్వు మాట్టాడమాక-అ టూ పాంకర్రా, కొబ్బరిపిప్ప గట్టిగా పట్టుకుని పాంపుట్టకాడ కూకుండాడు బసవాయి.

"బసవాయ్!" పిలిసింది ఎంకాయి.

పాంకర్ర వూత్తా నాగస్వరంపాట మైకంలోపడ్డాడు బసవాయి.

యాడా సలీ సప్పుడు లేదు. దూరాన గొడ్డపిల్ల

కాయలు బిల్లంగోడు కొట్టుకుంటూనే వుండారు. నాగస్వరానికి నిలబడి ఆడ్తుండ తాసుపాములకిమల్లే నిటారుగా నిలబడుండ తాడిసెట్లు గాలికిసల్లగా అటిటు కదులాడ్తుండయి.

బసవాయి మాట యినిపించుకునేట్టు లేడు. యీడికి యియ్యాల యిట్టా బుట్టిందేం? యీడు సిన్నప్పుడే నయం. కోతి కొజ్జిల్లాట బలే ఆడేవోడు. ఎదవసచ్చినోడు ఒక్కపాలన్నా నన్నుదొంగను సేసేవోడుకాడు. మాలావు నాకేనేట్టా ఆ మ్యాత్రం ఆట శాతకాందీ? ఆ పిచ్చాయోల్లు బసవాయి నన్ను దొంగని సెయమని ఒకటేమయిన ఏడ్చేవోల్లు! సీ పాడూ! ఆల్ల దెప్పుడూ యెదవ బుద్దేగందా! యిగ యిప్పుడేం వుండదీ? బసవాయి ఆటల్లో కలవటమే మానేశాడు. ఎప్పుడు సూసినా ఏ డొంక మలుపుల్లోనో తిరుగుతావుంటాడు. యీ మద్దె యీడికి మడుసులంటేనే పట్టంలా. మడుసు లేం కరుత్తారా దెగ్గరకొత్తే? పావలాబిల్ల యింకా గాపకం పెట్టుకుండాడే! ఎవురికేం అక్కర్లా - ఆ డిత్తానన్నా అక్కర్లా. సీ - డబ్బు లడగడమేంది పాడూ! అప్పుడెప్పుడో అడుగుతే యింకా గాపకంపెట్టుకుండాడే! నామీద ఆశికి నిజంగా గురి వుండదా? ఏంపాడో...యీడికేవన్నా గాలి పట్టలేదుగందా? రాంబెమ్మయ్య అద్దరూపాయి డబ్బులకి తాసుపాంని పట్టుకుని యిసం పిండుతాడంట! యీడి అయ్యోల్ళుకూడా యింతే నంట. యింకేం యీడూ తయారయ్యాడూ! అద్దరూపాయ్! ఆడన్నట్టు అద్దరూపాయంటే మాటలా.! ఆ అద్దరూపాయుంటే ఏంకొన్నా కొనచ్చు - అయితేమట్టుకూ! పాముల్నా పడ్తానంటం? పెమాదంగాదూ?, ఒక్కోపాలి- సీ అనగూడదుగానీ -

పానాలుగూడా పోతయి...అసలవి మనుషులుండేసోటికి అంత సులబంగా రావంటనే ? యీడెంత పాంక్రరవూదుకున్నా అవి రాకుంటేసరి. అసలా పుట్టలో పాముండదో లేదో. ఉంటే యింతసేపు రాకుండా వుంటదా ? ఒకవేళ అది బయిటికివొస్తె యీడికి దాన్ని పట్టడం సరీగా శాతకాకపోతే ? యింకా ఏమన్నా వుండదీ – "ఒరేయ్ బసవాయ్ యిక సాల్లే రారా ?" అంది ఎంకాయి.

బసవాయి ఎప్పుడో నాగలోకానికిపొయ్యాడు. ఎంకాయి యీడ కూకుండదని ఆడికి అసలు తెలవదు. పాంక్రరవూత్తా అటనే వూగుతుంటాడు బసవాయి.

ఎంకాయి కళ్ళు మెరిసిన్నై – ఒక్కపాలి ఎనిక్కి యిసుకపత్తది ఎంకాయి. పుట్టలోంచి తలతలతల మెరుస్తా జలజల జారి దోసెడు పడగిప్పుకుని బసవాయిముంగల తోకమీన నిలబడి వూగుతూ ఆస్తుండదా తాసుపాం! అటనే నేలకు నీలుక్కపోయింది ఎంకాయి.

నిశిరేత్రి మెరుమ్మెరిసి డామ్మని పిడుగుపడ్డట్టు–తాసుపాం తనముంగల నిలబట్టం సూశాడు బసవాయి. పాంక్రరవూత్తానే– ఒక్కపాలి కళ్ళు మూసుకుండాడు బసవాయి. బసవాయి గుండెల్లో ముళ్ళు పొడిసినట్టు సూసింది తాసుపాం. ఒల్లు తడిసింది బసవాయికి. మెడతిప్పి ఎనిక్కితిరిగి సూశాడు – యిగ్రహానికిమల్లే నీలుక్కబోయి గుడ్లిప్పుకొని సూత్తుండది ఎంకాయి. మెడ బిగిసింది బసవాయికి.

సల్లగా సెయి బనుకుతా – పాంక్రర తాసుపాం పడిగ మీనకి బోనిత్తుండ బసవాయికి మద్దెలో నరాలు పటపట

బిగలాగటాన పట్టుదప్పి ఎనిక్కి తూలిన తూల్టం ఎగ్గిర్లెగిసి గెంతేసి పుసిమీన ఎల్లి ఎంకాయి సెయి పట్టుకని తాడితోపు లోంచి బెయిటికి అదేమయిన లగెత్తాడు.

"యదవ సచ్చినోడా - పానం తీశావుగదంట్రా - యిడూ సెయి-" అంది ఎంకాయి రొప్పుతూ.

"అరవమాకే-" అన్నాడు బసవాయి తాడితోపు కల్లి బిత్తరి సూపులు సూత్తా.

"సెపితే యిన్నావంట్రా. ఒరేయ్ ఎండ్రకాయలు పట్టుకోక ఎందుకొచ్చిందిరా నీ కీపనీ-" అంది ఎంకాయి టపీమని కళాపి గొట్టినట్టు.

* * *

ఆయాల్టినుంచి బసవాయి ఎంటపడింది తాసుపాం. పులిస్తరాకు లెగుస్తే తాసుపాం లెగుస్తున్నట్టుంటున్నది బసవాయికి. ఎవురన్నా గబగబ మాట్టాడుకుంటుంటే బసవాయి ఎంటికలు నిక్కబొడుసుకుంటుండై. సూర్లో తాడు, రోడ్డు మయాన, రోడ్డుపక్క తాళ్ళనుసూసి ఎనిక్కి ఎగ్గిరి గెంతేసి యీపు సరుసుకుంటుండాడు బసవాయి. కలలుకన్నాడు బసవాయి. గోడ మొత్తలకాడ, గుడిసె సూరుసందుల్లో, శాంతాడుసుట్ట మయాన తననుసూసి తాసుపాం 'బుస్సు' మంటా పడిగ ఎనక్కితీసుకోటం ఎన్నోసార్లు కల్లోసూశాడు బసవాయి. తమాసా! ఓ నిశిరేత్రి ఎంకాయి తాసుపాముకు మల్లే 'బుస్సు' మంటం సూశాడు బసవాయి.

కొన్నాళ్లకి ఓనాడు సందేల గొడ్డమందతో యింటికి తిరిగొత్తా తాడితోపులో ఆ పుట్టకాడ గెడకర్రకిమల్లే తాడి

సెల్లలో కలిసిపోతా ఎవ్వురో నిలబడుంటం మసగ్గా సూసింది ఎంకాయి. ఒక్కపాలిగా నిలిసిపోయింది ఎంకాయి. ముందుకుపోను ఎంకాయికి కాలాడలా. సల్లగా మందనించి ఎని క్కనిక్కి తగ్గి తాడికోపుకాడి కొచ్చి సూసింది ఎంకాయి. నిజంగా ఆ పుట్టకాడ ఓ మడిసి నిలబడుండాడు. బసవాయి కాదు గందా! యిదేంది యీడికేవన్నా గాలిబట్టిందా? యీ యాలప్పుడు ఒంటరిగా ఆడ నిలబట్టానికి ఎంతదైర్నం ఉండాల?

మసగలో తడువుకుంటా పుట్టకాడికొచ్చి – ఒక్క పాలి కేక బెట్టి అటనే నోరుదెరిసి కొయ్యకిమల్లే నిలబడిపోయింది ఎంకాయి.

ఆ తాసుపాం బసవాయి మెడా, సెయీ బిగదీస్తుంటే, దాని మెడకాడ పట్టుకుని గొబ్బరి సిప్పలోకి దాని యిసం పిండు తుండాడు బసవాయి !

దైర్నంగల మొగోడు ,గుండెబిగువుమీన దెబ్బయి గెజాల ఎత్తయిన దొజత్తంబంమీనకు ఒక్కక్కజరుగే జరు క్కుంటా ఎల్తుండే యవదానంలో ఒకాండగూతురు గుండెబెదిసి ఒక్క పాలికేక పెట్టేతలికి అంత దైర్నంగల మొగోడిగుండె బిగువ్వూ కుండ పగిల్నట్టు పగిలి, నరాల పట్టుతప్పి సెవటలు గక్కులా గిరగిర తిరుగుతా దెబ్బకు బూమిమ్మీన పడాల్సినదన్న మాట!

గబిక్కిన ఎనక్కితిరిగి సూశాడు బసవాయి వూపిరి బిగబట్టి.

"ఎళ్ళు –" అన్నాడు బసవాయి దవడలు కరుసుకుంటా.

"ఓమ్మో –" మూగిలింది ఎంకాయి.

పోట్టలిచ్చిన పత్తికాయలకిమల్లే ఎంకాయికళ్ళు బస వాయి గుండెలమీన దిగినై.

"ఎల్లిపో - మళ్ళీ ఎందుకొచ్చా యీడకి? నాసెయి జాస్తుండది - ఎల్లిపో అరవకుండా - "

"అరవన్లేరా - ఒరేయ్ - ఒరేయ్ - నిన్ను సంపుద్దిరా - దాన్ని సంపరా - " మూలిగింది ఎంకాయి.

తాసుపాంకల్లి సూశాడు బసవాయి. తాసుపాం రఖతం గక్కతా పటపట గొబ్బరిసిప్పను కొరుకుతా వొనుకు తుండ సెయి సుట్టూ మెల్దిరుగుతుంటే - ఒక్కపాలి గట్టిగా నరాలు బిగబట్టి, ఎంకాయికల్లి కొరకొరసూత్తా సువ్వాకిమల్లే మెల్దిరిగి వుసిమీన తాడిసెట్ల సీకట్లోకి గబగబా లగెత్తు కెల్లాడు బసవాయి.

మరుస నాట్నుంచి జరంలో మతుండక మంచంలో పడుండాడు బసవాయి. "వాడికేం రాయిలాంటి మనిషి." బసవాయికేం ఫరవాలేదన్నాడు ఎంకాయితో వైద్దికుడు రాంబెమ్మయ్య.

కొన్నేళ్ళు గడిసినాక ముగ్గురు బిడ్డలత్తో పుట్టింటికి తిరి గొచ్చిన ఎంకాయిని తాడితోపుసాయల్న "ఏం ఎంకాయ మ్మోవ్!" అని బసవాయి పలకరించేదాకా బసవాయిని ఎం కాయి పోల్చుకో లేకపోతోంది.

"సంపావు గదంటయ్యా బసవయ్యా! పోల్చుకోనే లేక బోతినే నా తెలివి పాడుగానూ! బాగుండావంటయ్యా? బొత్తిగా గురుతు పట్టకపోతినే!" అంటూ బసవాయిని యిశారించింది ఎంకాయి.

"చరే, పెద్దోణ్ణయిపోటంలా! నీకు ముగ్గురు బిడ్డలంటగా, బాగుండారా?" అన్నాడు బసవాయి.

"ఆఁ, బాగుండారయ్యా బసవయ్యా. పెద్దోడిపేరు ఆళ్ల తాతపేరు పెట్టుకుండారూ, రెండోవాడిపేరు ఎంకటేశ్వర్లు, మూడోదానిపేరు చీతాం." అంది ఎంకాయి.

"నువ్వూ కొత్త పెద్దదానివయినా మడిసివి అంతగా మార్లేదులే" అన్నాడు బసవాయి పక్కకి తిరిగి వుమ్మూస్తా.

"ఏబ్బే, అదేందయ్యా యింగా పెద్దదాన్ని కాలేదంటావు ముగ్గురు బిడ్డలయితేని! యింగానయం! నువు పెద్దోడివయ్యావు. సానా సన్నబడ్డావు" అంది ఎంకాయి.

"కొత్త మద్దెమద్దె వొల్లు సెడ్తావొచ్చిందిలే – సానా ఏళ్లుకాలా మరీ –" అన్నాడు బసవాయి.

"సానా ఏళ్లయింది" అంది ఎంకాయి.

"అంతా నిన్న మొన్న జరిగినట్టుంది," అన్నాడు బసవాయి.

దూరాన గొడ్డు ఆ డీడ గెనువులెంట తిరుగుతుంటే గొడ్డపిల్లకాయలు బిళ్లంగోడు ఆడుకుంటుండారు.

"బలే బయంబుట్టింది" అంది ఎంకాయి.

"నువు కోక పైకెగ్గట్టుకుని ఎనిగీడ్తేవొచ్చి ఆడ నిలబట్టం యింగా కళ్లల్లో మెదుల్తుండది," అన్నాడు బసవాయి.

"ఎట్టాపట్టుకుండా ఆ తాసుపాముని – సివరకి ఏం జేశా దాన్ని? నువామయిన లగెత్తుకు పోయినాక అడలుబుట్టి సచ్చా. యాడజూసినా అగుపించలానువ్వు."

"ఆమూలకిపోయి, దాని యిసంపిండి తల నేలకేసి రుద్దిరుద్ది సంపేశా," అన్నాడు బసవాయి.

"ఓమ్మో !" అనరిసింది ఎంకాయి.

''అదిగో - ఎంకాయోవ్ -''

''బలేబయ్యం పుట్టిందిరా బసవాయ్-"

"సంపేత్తివి గదంటే ఎంకాయ్-"

"అదేంది బసవయ్యా ఎనకటికిమల్లే ఒరే, ఒరే అంటుండానూ - ఛీ, సచ్చిందాన్ని - యిదేంమడిసినీ - యిహి, యిహి -" అంటూ ఎంకాయినవ్వుతే బసవాయీ నవ్వాడు "అంటే అన్నావులే" అంటూ.

"సివరికీ రాంబెమ్మయ్య ఆల్చెం అయిపోయిందని గరగళానికి అద్దరూపాయి బిల్లయీాయనే యీాయలేదుగా," అన్నాడు బసవాయి.

"ఆరి యీాడిజిమ్మడా! నిజంగా యీాయనే యీాయలా?" అంది ఎంకాయి.

"అబ్బే నీకోడు యీాయనే యీాయలేదుగా! యిత్తే నీకు పావలాబిల్ల ఎప్పుడో యీాయక బోయ్యేవాణ్ణా!" అన్నాడు బసవాయి.

"అదేంది బసవయ్యా యింగా పావలా బిల్లంటుండావూ-!"

"అంటే ఏంలే. మాటన్నాక యీాయకనే బోతినిగా."

"పోనీలే బసవయ్యా - అందరూ బాగుంటే. అంతే సాలు."

"అంతేలే ఎప్పటికయినా–" అన్నాడు పక్కకు తిరిగి వుమ్మూస్తా.

"మా పిల్లల్ని సూశావంటయ్యా బసవయ్యా!"

"ఏదీ నువ్వు సూపియ్యకనే బోతివిగా."

"బలేవోడివిలే! ఆనక మాయింటికొస్తే తప్పేట్టా!" అంది ఎంకాయి నవ్వుతా.

"ఓ బసవయ్యోవ్, ఓ ఎంకాయమ్మోవ్ కాత్త ఓ పాలియిటొచ్చి పోండయ్యా మీ మడుసులు బంగారంగానూ!" అని ఒక్క పాలరిశారు పిల్లంగోడుకాడ తగువొచ్చిన గొడ్ల పిల్లకాయలు.



# వెంకటస్వామి పాలెం

ఎవురో యీపుమీన పెటీమని సరిచినట్టు వులిక్కిబడి గబిక్కున లెగిసి కూకుండాడు వెంకటస్వామి.

ఇంకా సెన్నపట్టంనుండి కలకత్తాకిబోయే తుర్మేలుబండి రాకతలికే – అంటే మామూలుగా తెల్లారుజామున జనమంతా లెగిసి పసిపాటలు సేసుకోనేయాల యింకా సానాసేపు వుందనంగానే ప్లీడరు అనుమంతయ్యగారి ఆఫీసుగది దర్వాజాకు పక్కన మూలగా సాపమీదముడుసుక్కు పండుకునుండ అనుమంతయ్యగారింటి పసిపిల్లకాయ ఎంకటస్వామి మామూలుయాలకు ఎతిరేకంగా తెల్లారి మూడుగెంటల యాలప్పుడు ఉండట్టుండి ఆవజాన ఎగ్గిరిపడి లెగిసి కూకుండాడంటే పైనుంచి ఏదయినా బల్లిపిల్ల గిల్లిపిల్ల మీనకు దూకయినావుండాల, కాదుగూడ్దంటే ఎలికెపిల్ల బొలికెపిల్లయినా గబిక్కున గీకి ఎటుగానో లగెత్తుకు పోయన్నా పోయుండాల! అయితే ఆవజాన ఎగ్గిరిపడి లెగిసి బిత్తరసూపులు సూత్తుండ ఎంకటస్వామి ఎసువంటి బల్లిపిల్ల ఎలికపిల్ల జోలికిబోక లెగిసినోడు లెగిసినట్టే గోడకు ఆవజానే కరుసుకుని నిటారుగా కూకుండిపోయ్యాడు.

ఎంకటస్వామి కలగన్నాడు. నిదర్లో కలగన్నోళ్ళు నిదర్లెగిసినాక ఆ కల ఏలా యిశేషాన్నిబట్టి ఎటువంటి సూపులు

సూత్తాకూకున్నా కూకుండొచ్చు. ఎంకటస్వామి యింకా బిత్తరసూపులుసూత్తా గోడకు నిటారుగా కూకునుండాడు.

ఆవజాన తెగిసీ తెగవంగానే ముంగల తను కలగన్నా ననుకోలా ఎంకటస్వామి. కాని అనుమంతయ్యగారి యింటి జనం యాడపండుకున్నోరు ఆడే సలీసప్పుడు కాకుండా పండుకు నుండేతలికి యిగ తను కలగన్నది కాయమనుకున్నాడు ఎంకట స్వామి.

ఇట్టా కోర్టుకెల్లిన అనుమంతయ్యగారు గబగబ బూడ్సూ సులు, టకటకటక కొట్టుకుంటూ వొచ్చి ఆఫీసు దర్వాజా తలుపు గబాల్న దెరిసి మూలపండుకునుండ తన తలకాడ నిలబడి వొంగి తనకల్లి గుడ్రిగా సూస్తుండట్టు ఎంత గట్టిగా నయినా కలగన్నాడు ఎంకటస్వామి.

అనుమంతయ్యగారెందో, తనకల్లి అట్ట సూట్టమేందో, తనావజాన ఎగ్గిరిబడి ఎందుకు తెగిశాడో అరదంకాక కాత్తె తికమకబడ్డాడు ఎంకటస్వామి.

ఇంకా యింటోయాడా ఎవురూ తెగవలేదు. యింటిపని సేసుకునేయాల యింకా సానావుంది. అయినా యిగ నిదరబట్ట లేదు ఎంకటస్వామికి. అటనే గోడకు ఆనుక్కూకుని ఆలోసె నలో పడ్డాడు ఎంకటస్వామి.

ఇంతకుముంగల తను ఎన్నో కలలు గన్నాడు ఎంకట స్వామి. తను పాలెంలో అయ్య అమ్మోళ్ళను వొదిలేసి అను మంతయ్యగారితో బస్తీకి మొట్టమొదటసారిగా రావటం, బస్తీలో వెల్లటీదీపాలు, రంగురంగుల అద్దాల దుకాణాలు, గోడలమీద సినిమా పేపర్లు, వందలకొద్ది మడుసుల్లాగే రిక్షా

బళ్ళు, ఎన్నెన్నో గుర్రబళ్ళను తను కలగన్నాడు. ఆమీాన తన కెందుకో బస్తీమీాన కలలు రావడం తగ్గినై. యీాడకి వచ్చిన కొన్నాళ్ళకే తనకి బస్తీమీాన మోజు తగ్గుతావొచ్చింది. యింకోనాడు అయ్యా అమ్మాతో తనూ రంగన్నా, రామన్నా, సీతక్కా, బూసాం, సుబ్బాం కలిసి వరికోతలికిబోయి ఆడ బూసాం, సుబ్బాం, గెనుములవెంట పిల్లిమిసరకాయలు కోసుకు తింటుండట్టు కలగన్నాడు తను. యింకోపాలి పాలెంలో శివుడి గుడి ము గల ఎన్నెట్లో తను కోటాయి ముటాతో గలిసి బలి గుడు ఆడ్తుంటే మూలచ్చి సప్పుట్లు సకుస్తూ ఎగుర్తుండట్టు కల గన్నాడు.

అయితే యియ్యాళ తనుగన్న కలకీ, ఎనకటి కలలకీ ఎటుగా సూసినా సంబంధం లేదు. కలలో అనుమంతయ్యగారు ముక్కూ-ముక్కద్దాలాడిస్తా ఆవజాన సూత్తావుండటం ఒకిదంగా ఎంకట స్వామికి కడుపులో తొలిసినట్టయింది.

ఇయ్యాల కలలో పరీచ్చగా సూసినంతగా అనుమంతయ్య గార్ని యింతకిముంగల సూడలా ఎంకటస్వామి. ఎందుకో అనుమంతయ్యగారు తనవేపు అట్టా సూత్తుంటాడు? యీామద్దె అనుమంతయ్యగారు తనవేపు యీావజాన రెండుమూాడుసార్లు సూసినట్టు ఎంకటస్వామికి మసగమసగ్గా అగుపించింది.

ఓపాలి తను అనుమంతయ్యగారి బూదుాసులు అంతకు ముంగలే పాలీసుచేసి దరవాజాపక్కనబెట్టి, దొడ్లోకెళ్ళి నీల బాయిలేరుకు నిప్పు తగిలించి, సిమింటి తొట్లోకి బాయిలోంచి ముప్పయి కడవల నీలులాగి, నీలతూాములు కాడ గబ్బుకొడ్తుంటే పినాయిలుబోసి కడిగి, సెట్లపాదులకాడ సెత్త సెదారం ఎత్తేసి,

మచ్చుమీన కట్టెలుదింపి పేళ్ళోలిసి, నీలగదిలో జిడ్డుగావుంటే గొబ్బరిపీసుతో రుద్ది, మెట్లగెదికాడ పినాయిలు డబ్బా పెట్టడానికి దర్వాజామలుపు యిట్టదిరుగుతా గబిక్కన పాలీసుచేసిన బూడూసులమీన సూడక తడికాలువేసి తొక్కాడు తను. నల్లగా నిగనిగమంటుండ బూడూసులమీన తడికాలు పడేతలికీ ఆ బూడూసులు ఎట్టయిపోయిందీసూసి బిత్తరబోయితను యిట్లా పక్కకి తిరిగిసూత్తే - దర్వాజాపక్కనే నిలబడి తనవేప్రు, ముకూ, ముక్కద్దాలాడిస్తాయింతగా సూస్తుండాడు అనుమంతయ్యగారు.

ఇంకోపాలి తను పడగ్గదులు, భోజనాలగది, ముట్లుగది, మెట్లగది కడుగుతా, గుడ్డతో నీలుపింది పారబోస్తా ఆఫీసు గదిలోకొచ్చి కురిజీలు వరండాలో పెడ్తా మేజాకాడి కొచ్చేతలికి, అనుమంతయ్యగారి రెండో అబ్బాయి సుందరం బొమ్మల పుత్తకం ఆడ తెరిసిఉంది. అనుమంతయ్యగా రబ్బాయిలు కనకం, సుందరం మేజాముంగల కురిజీల్లో కూకోని రోజూ అదేమయిన పుత్తకాలు సదువుకుంటా, ఆ బొమ్మలు ఈబొమ్మలని నవ్వుకుంటా గిచ్చుకుంటావుంటే తనూ కాత్తెసూద్దామని అయ్యేందో సెప్పమని కనకం, సుందరాల్ని అడిగితే ముంగల కనకం ఎక్కిరిత్తే ఆనక సుందరం ఎక్కిరిచ్చాడు తనని. అటేలు సూసి తను సల్లగా ఆ బొమ్మలపుత్తకాన్ని తీసుకోని కాయితాలు తిప్పుతా రంగురంగుల రవిలుబండి, కోళ్ళు, కొండలు సూత్తా అటనే కురిజీలో కూచుని పొయ్యేతలికి, ఎవురో తన పక్కనొచ్చి నిలబడి నట్టనిపించి, యిట్ట తలెత్తిసూత్తే, అను

